APTEL 15625

అటవీశాఖ సమాచార పత్రిక

# వన సంరక్షిణి

జూన్ 2018

సంపుటి : 1 సంచిక : 6

చీఫ్ ఎడిటర్
జె.ఎస్.ఎన్.మూర్తి, IFS
ముఖ్య అటవీ సంరక్షణాధికారి మరియు సంచాలకులు : ఏ.పి. స్టేట్ ఫారెస్ట్ అకాడమీ

ఎడిటోరియల్ విభాగం
డా॥ నందని సలారియా, IFS
డివిజనల్ అటవీ శాఖాధికారిణి, కాకినాడ

దీక్షితుల ఆర్.వి. సుబ్రహ్మణ్యం
పి.ఆర్.ఓ

## ఏపీ స్టేట్ ఫారెస్ట్ అకాడమీ

# ఐదుమాసాల్లో అద్వితీయ ప్రగతి



రాష్ట్ర విభజన నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ కు ప్రత్యేకంగా అకాడెమీ ఏర్పాటు ఆవశ్యకత ఏర్పడింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన చట్టం 2014 లోని 10 వ షెడ్యూలు ప్రకారం ఆంధ్ర ప్రదేశ్ అటవీ శిక్షణ సంస్థ ఏర్పడింది. దూలపల్లి నుండి విడివడిన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర అటవీ శిక్షణ సంస్థ కొరకు అటవీ శాఖ అనేక రకాల జీవ వైవిధ్యంతో వివిధ అడవుల రకాలతో తూర్పుగోదావరి జిల్లా, కాకినాడ డివిజన్ పరిధిలో జాతీయ రహదారి-16 రాజమహేంద్రవరం-విశాఖపట్నం మార్గంలో దివాన్ చెర్వు పరిధిలోని స్థలాన్ని ఎంపిక చేసి యుద్ధ ప్రాతిపదికన ప్రారంభించింది.

అటవీ పరిరక్షణ, వన **లోపలి పేజీలో...**

## 30న సిసిఎఫ్ శ్రీ జెఎస్ఎన్ మూర్తి పదవీ విరమణ



రాజమండ్రి సర్కిల్ ముఖ్య అటవీ సంరక్షణాధికారి, ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ ఇన్‌చార్జి డైరెక్టర్ హోదాలో శ్రీ జొన్నాడ సత్యనారాయణమూర్తి, ఐఎఫ్ఎస్ జూన్ 30వ తేదీన పదవీ విరమణ చేస్తున్నారు. 1959 నవంబర్ 21న విశాఖపట్నంలో జన్మించిన శ్రీ మూర్తి అంకితభావంతో కూడిన విధినిర్వహణకు, ఉత్తమ సేవలకు ప్రతీకగా నిలిచి సర్వత్రా ప్రశంసలందు కున్నారు. గుంటూరులో బిఎస్‌సి (అగ్రికల్చర్), తమిళనాడులో ఎంఎస్‌సి (అగ్రికల్చర్) చదివారు. 1-6-1983న మారుటేరు వ్యవసాయ పరిశోధనా కేం ద్రంలో ఆయన అ సిస్టెంట్ సోయిల్ సైంటిస్ట్‌గా తొలి సారి ఉద్యోగ బా ధ్యతలు చేపట్టారు. అటవీశాఖలో ఎసిఎఫ్ ట్రెయినీ హోదాలో 1-1-1984న చేరారు. కోయంబత్తూరు స్టేట్ ఫారెస్ట్ సర్వీస్ కాలేజీలో ఆయన

**లోపలి పేజీలో...**

## భావితరాల భద్రతకు

# వాల్టా యాక్ట్

భూమిపై మానవుడి మనుగడకు నీరు, వృక్షాలే ప్రాణాధారాలు. నీటి వృథాను అరికట్టి ప్రతి నీటిబొట్టూ సద్వినియోగం చేసుకుని వృక్ష సంపదను పరిరక్షించుకుంటే భూమి, మానవులు ఇతర జీవరాశులు కూడా భద్రంగా ఉంటాయి. ఈ లక్ష్యసాధన కోసం రూపొందించినదే ఆంధ్రప్రదేశ్ నీరు, భూమి, వృక్షాల చట్టం- 2002 (Andhra Pradesh Water Land and Trees Act). ప్రతి ఒక్కరు దీని గురించి తెలుసుకొని దీని అమలులో భాగస్వాములు కావాలి. ఈ చట్టం యావత్తు రాష్ట్రానికి వర్తిస్తుంది.

నీరు, భూమి, వృక్షముల అథారిటీ పేరుతో రాష్ట్ర ప్రభుత్వం అధీకృత వ్యవస్థను ఏర్పాటు చేసింది. ఈ అథారిటీ ఎప్పటినుండి కార్యాకలాపాలను ఏవిధంగా నిర్వహించాలి, ఎవరు చేయాలి అనే విషయాన్ని నోటిఫై చేయడం జరిగింది. ఈ అథారిటీలో క్రింది సభ్యులు ఉండాలి.
పంచాయితీ గ్రామీణాభివృద్ధి, గ్రామీణ నీటిసరఫరా మంత్రి లేక ముఖ్యమంత్రి నామినేట్ చేసిన ఎవరైనా మంత్రి ఎక్స్ - అఫిషియో చైర్మన్ గా ఉంటారు. రాష్ట్ర శాసనసభ సభ్యులను ఎక్స్ - అఫిషియో సభ్యులుగాప్రభుత్వం నామినేట్ చేస్తుంది. వీరిలో ఒకరు ప్రధాన ప్రతిపక్షం నుంచి ఉండాలి. రాష్ట్ర ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి అథారిటీకి వైస్- ఛైర్మన్‌గా వ్యవహరిస్తారు.

వ్యవసాయ శాఖకు చెందిన ప్రభుత్వ కార్యదర్శి, ప్రభుత్వ ఇరిగేషన్ మరియు కమాండ్ ఏరియా అభివృద్ధి శాఖా కార్యదర్శి, మున్సిపల్ పరిపాలనా కార్యదర్శి, గ్రామీణ నీటి సరఫరా కార్యదర్శి, పంచాయితీరాజ్ కార్యదర్శి, పర్యావరణం, అడవులు, శాస్త్రీయ, సాంకేతిక శాఖా కార్యదర్శి, ఆచార్య ఎన్.జి.రంగ వ్యవసాయ విశ్వ విద్యాలయ వైస్ ఛాన్సలర్ ఎక్స్-అఫిషియో సభ్యులుగా ఉంటారు. భూమి జీవశాస్త్రాలు, ఇంజనీరింగ్, టెక్నాలజీ విభాగాల్లో ఒక్కొక్కరు చొప్పున రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలలో పనిచేస్తున్న ముగ్గురు ప్రొఫెసర్లను సభ్యులుగా తీసుకుంటారు. (వీరిని ప్రభుత్వం నామినేట్ చేస్తుంది, వీరి పదవీ కాలం రొటేషన్ పద్ధతిపై 2 సం॥లు). నీరు, భూ సంరక్షణ అర్థశాస్త్రములలో నిష్ణాతులయిన ముగ్గురిని రాష్ట్ర ప్రభుత్వం సభ్యులుగా నామినేట్ చేస్తుంది. ప్రకృతి వనరుల సంరక్షణలో మక్కువ కలవారని ప్రభుత్వం భావించిన అనధికార వ్యక్తులు ఐదుగురిని ప్రభుత్వం సభ్యులుగా వేస్తుంది. వీరిలో ఒక ఎస్‌సి, ఒక ఎస్‌టి, ఒక మహిళ తప్పక ఉండాలి. రాష్ట్ర ప్రభుత్వ గ్రామీణాభివృద్ధి శాఖ కార్యదర్శి ఎక్స్ అఫిషియో సభ్యుడు-కార్యదర్శిగా ఉంటారు.

**భూసంరక్షణ చర్యలు :** ప్రభుత్వ ఆదేశాలకు లోబడి రాష్ట్రంలోని భూగర్భ జలవనరులన్నీ అథారిటీ చేత నియంత్రించబడతాయి. **లోపలి పేజీలో...**

## జంతు జాలం

# మృగరాజు సింహం



దీనిని ఇంగ్లిష్ లో లయన్ (lion) అంటారు. ఇది క్రూర జంతువు. మృగాలకు రాజు (మృగరాజు) గా సింహాన్ని వర్ణిస్తారు. ఇది ఎక్కువగా అటవీ ప్రాంతంలోని మైదానాలలో నివసిస్తుంది. సింహాలు 5 నుంచి 10 వరకు గుంపుగా ఉంటాయి. సింహం పొడవు 5 - 8 అడుగులు, బరువు 150 - 250 కిలోల వరకు ఉంటుంది. మగ సింహం జూలును కలిగి ఉంటుంది. ఆడ సింహాలకి జూలు ఉండదు. సింహాలు దాదాపు రోజంతా విశ్రాంతి తీసుకుంటూ ఉంటాయి. పగటి వేళ సుమారు 20 గంటలు విశ్రాంతి తీసుకొంటూ, ఎక్కువగా రాత్రులు వేటాడుతుంటాయి. ఇవి ప్రధానంగా జింకలు, కంచర గాడిదలు, అడవి పందులు, అడవి దున్నలను వేటాడతాయి. ఆడ సింహాలే ఎక్కువగా వేటాడుతుంటాయి.

**అంతరించి పోతున్న సింహాలు**

భారతదేశంలో ఇప్పుడు సింహాలు అంతరించిపోతున్న జాతి. ప్రస్తుతం గుజరాత్ లోని గిర్ అభయారణ్యంలో మాత్రమే సింహాలు కనబడుతున్నాయి. ఆసియా ఖండం వ్యాప్తంగా కూడా ఇవి అంతరించే దశకు చేరుకున్నాయి. ఇంతకు పూర్వం సింహాలను సర్కస్‌లలో ప్రదర్శించడం, ఆడించడం చేసేవారు. ఇప్పుడు వాటి ఉనికి అడవుల్లో కూడా కనిపించడం లేదు. సింహాలను రక్షించేందుకు గుజరాత్ ప్రభుత్వం నాలుగు విభాగాలను ఏర్పాటు చేసింది. కానీ ఇప్పుడు వాటన్నింటినీ కలిపి ఒకే విభాగంగా మార్చాలని నిర్ణయించింది. 'గుజరాత్‌లో ఇటీవల సింహాల పరిరక్షణకు సంబంధించి కొన్ని కఠిన నిర్ణయాలు తీసుకున్నారు. సింహాల ప్రదర్శన కార్యక్రమాలు నిర్వహించినా, వాహనాలపై వాటిని వెంబడించినా, వాటి ఫొటోలు తీసినా కూడా చర్యలు తీసుకోవాల్సిందిగా అటవీ శాఖ అధికారులను అక్కడి ప్రభుత్వం ఆదేశించింది. మృగాలను వేటాడటం అంటే చంపడమే కాదు. ఓ జంతువును హింసించినా, భంగపర్చినా అది వేటే అవుతుంది.' అని ఆ రాష్ట్ర అటవీశాఖ మంత్రి తెలిపారు. సింహాలు కనిపిస్తే మాంసాహారాలు విసరడం, వాటిని వెంటాడటం వంటి ఘటనలు ఇటీవల పెరిగాయి.

## వృక్ష జాలం

# చింతచెట్టు



చింత (Tamarind) ఒక పెద్ద వృక్షం. దీన్ని 'భారతదేశపు ఖర్జూరం' అంటారు. దీని శాస్త్రీయ నామం టామరిండస్ ఇండికా. చింత చెట్టు కాయలు, పండ్లు తినటానికి ఉపయోగ పడతాయి. ప్రపంచ వ్యాప్తంగా వంటకాల్లో వీటిని ఉపయోగి స్తారు. సంప్రదాయ ఔషధాలు, మెటల్ పోలిష్ తయారీలో ఉపయోగిస్తారు. ప్రపంచ వ్యాప్తంగా ఉష్ణమండల మరియు ఉపఉష్ణమండలాల్లో కూడా చింతను సాగు చేస్తారు. షెంకుతోనున్న చింతపండును చింతగుల్ల అంటారు. కాయని చింతకాయ అని పండును చింతపండు అని అంటారు.

చింతచెట్టు ఇంచుమించు 20 మీటర్ల ఎత్తు పెరుగుతుంది. ఇవి వేసవిలో కూడా దట్టంగా ఉండి చల్లని నీడనిస్తాయి. చింత ఆకుల్లో 10-40 చిన్న పత్రకాలుంటాయి. చింతపండు గుజ్జు మధ్యలో గట్టి పిక్కలు ఉంటాయి. దక్షిణ భారతదేశీయుల ఆహారంలో చింతపండు చాల ముఖ్యం. రసం, సాంబారు, రకరకాల పులుసులు, పచ్చడిలో చింతపండు పుల్లని రుచిని స్తుంది. లేత చింతచిగురును ఆకుకూరగా ఉపయోగిస్తారు. చింతాకు టీ మలేరియా కి మందుగా పనికివస్తుంది. ఆసియాలో చింతపండు పీచును కంచు, రాగి పాత్రల్ని శుభ్రం చేయడానికి మెరుపు తేవడానికి వాడతారు. ఈజిప్టులో చింతపండు రసం పానీయంగా సేవి స్తారు. థాయి లాండ్ లో తి య్యని చింత పండు ఇష్టం గా తింటారు. చింతపిక్కలను బిస్కట్ల తయా రీలో ఉపయోగిస్తారు. జిగురు తయారీకి వాడుతారు. ఇంటి ఫర్నిచర్ తయారీలో చింత కలప వాడతారు. రహదారి కిరువైపులా నీడకోసం చింతచెట్లను ఎక్కువ పెంచుతారు.

చింతచిగురును నీడలో ఎండబెట్టి చింత చిగురు పొడిని తయారు చేస్తారు. ఈ పొడిని ఇతర ఆహారపదార్థాల్లో కలిపి తింటే రుచిగా ఉంటుంది. రక్తహీనతను ఇది నివారిస్తుంది. చింతచిగురు రసంలో పటిక బెల్లం కలిపి తాగితే, కామెర్ల వ్యాధికి నివారణ కలుగుతుంది. వాతాన్ని హరిస్తుంది. మూలవ్యాధులకు ఉపశమనాన్ని కలిగిస్తుంది. చింతచిగురు ఉడికించి కీళ్లవాపులకు రాస్తే వాపు, నొప్పి తగ్గిపోతాయి. చింతచెట్టులోని ప్రతి భాగమూ ఉపయోగపడుతుంది. చింతచెట్టు వుంటే చింతే ఉండదంటారు పెద్దలు. ప్రతిరోజు వండే ఆహారపదార్థాల్లో లిచింతపండుకు ప్రత్యేకస్థానం ఉంది. చింతచిగురు, లేత చింతకాయలు, ముదురు చింతకాయలు, పండిన చింతగుల్లలు, చింతపువ్వు, చింతగింజలు ఎంతో ఉపయోగపడతాయి.

చింతపండు: పులుసు పుల్లదనానికి చాలా ఆహారపదార్థాలలో ఉపయోగిస్తారు. దీనిని కూరలలోను, సాస్, పచ్చళ్ళ, కొన్ని పానీయాల తయారీలో విస్తృతంగా వాడతారు. ఎరుపు రంగులో దృఢంగా ఉండడం వల్ల కలపగా ఇంటిసామాన్లు తయారీలో వాడతారు.



100 గ్రాముల చింతపండు 283 కేలరీల శక్తిని ప్రసాదిస్తుంది. సిట్రిక యాసిడ్ గుణాలు కలిగిఉన్న చింతపండు ఆయు ర్వేద పరంగా, పులి తేనుపులు అరికట్టడానికి, కడుపు ఉబ్బరానికి, జ్వరం, వికారం మొదలైన రోగాలకి మందులా వాడతారు. ఆకలి మందగించినవారు ఉదయాన్నే 4-5 చెంచాల చింతపండు రసాన్ని సేవిస్తే మంచి ఆకలి పుడుతుంది. శరీరంలోని వాపులకి, నొప్పు లకి చింతపండు రసంలో ఉప్పు కలిపి మసాజ్ చేస్తే మంచి ఉపశమనం ఉంటుంది. అజీర్ణరోగాలకి, జీర్ణశక్తిని పెంచ డానికి చింతపండు దివ్యౌషధం. గ్లాసుడు పాలలో కాచి చల్లార్చిన చింతపండు రసం 4-5 చుక్కలు వేస్తే పాలు విరిగిపోయి, పైన నీళ్ళు తేలతాయి. ఆనీటిని రోజుకు మూడు పూటలా తాగుతూవుంటే ఈ రోగాలనుంచి విముక్తి కలుగుతుందని ఆయుర్వేద వైద్యుల మాట. మూత్రకోశ వ్యాధులు, మూత్రకోశంలో రాళ్ళ నివారణకు కూడా ఇది మంచిది. చింతగింజలు కూడా ఆరోగ్య విషయం లో ఎంతో విలు వైనవి. చింతగింజలు పొడిచేసి చెంచాడు నీటిలో కలిపి సేవిస్తే ఆమశంక, జిగట విరేచనాలు తగ్గుతా యి.

రక్తస్రావాన్ని తగ్గించే గుణం ఈ పొడికి ఉంది. చింతపిక్కల పొడిలో పంచదార కలిపి వారం రోజులపాటు తీసుకుంటే, వీర్యవృద్ధి. చింతచిగురులో విటమిన్ ఎ. సి. ఐరన్ పుష్కలంగా ఉన్నాయి. చింత కర్ర కాల్చి, ఆ బొగ్గుల పొడిలో ఉప్పు, పిప్పర్‌మెంట్ పువ్వు కలిపి పళ్ళపొడి తయారు చేస్తారు. చింత బొగ్గులపొడిలో నువ్వుల నూనె కలిపి కాలిన చోట రాస్తే గాయాలు మానిపోతాయి. చింతచెట్టు వేరు గుండె అనారోగ్యాలను నివారిస్తుంది. ఈ చెట్టు బెరడు టానిక్‌లా ఉపయోగిస్తుంది. చింతగుల్ల నుంచి చింత పండులో విటమిన్ బి, కాల్షియం అధికంగా ఉంటాయి. ఆసియా ఖండంలోని అనేక దేశాలతో పాటు ఆఫ్రికా మొదలైన దేశాలలో కూడా చింత వనరులు ఎంతో వినియోగంలో ఉన్నాయి.

# ప్లాస్టిక్ కాలుష్యంతో పెనుముప్పు





## ఎడిటర్స్ వాయిస్



ప్లాస్టిక్ పర్యావరణానికి పెను విపత్తుగా ...ారింది. ప్లాస్టిక్ వాడకం లేని ప్రపంచమే ...ర్యావరణపరంగా శ్రేష్టమైనది. క్యారీ ...్యగులతో సహా ఎన్నో గృహావసరాలకు ...ాడి పడేస్తున్న ప్లాస్టిక్ భూమిలో కరగడానికి ...క్షల సంవత్సరాలు పడుతుంది. ప్లాస్టిక్ ...ంటే పోలిమర్లు -మోనోమర్లు అనే ...నరుక్తమయ్యే యూనిట్లని కలిగి ఉన్న పెద్ద ...ణువులు. ప్లాస్టిక్ సంచుల విషయంలో, ...నరుక్తమయ్యే యూనిట్లు "ఎథిలిన్". పోలి ...థిలిన్ ఏర్పడడానికి ఎథిలిన్ అణువులు ...హురూపం చెందినపుడు, అవి పొడవైన ...ర్చున అణువుల చెయిన్లను ఏర్పరుస్తాయి. ...ందులో ప్రతి కార్బన్ రెండు హైడ్రోజన్ ...రమాణువులతో బంధం ఏర్పరచుకుం...ంది. ప్లాస్టిక్ తయారీ ప్రకృతిలో సహజ ...ద్ధంగా లభించే పదార్థ అణువులతో ...కుండా కృత్రిమంగా తయారు చేసే అణు...ంజాలతో (ఈ అణుపుంజాలను పాలిమర్స్ అంటారు) జరుగుతుంది. మూల పదార్థం ముడి చమురు (క్రూడ్ ఆయిల్). ప్లాస్టిక్ తయారీకి కావలసిన ముడి పదార్థాలను పొందటానికి ముందుగా ముడి చమురును వేడిచేయాలి. ఈ ప్రక్రియను చమురు శుద్ధి కార్మాగారం (ఆయిల్ రిఫైనరీ) లో సుమారు 400 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రత వద్ద జరుపుతారు. ఇందులో లభించే 'నాఫ్తా' అనే పదార్థాన్ని తిరిగి 800 డిగ్రీల వరకు వేడి చేసి, వెంటనే 200 డిగ్రీల ఉష్ణోగ్రతకు చల్లారుస్తారు. ఇలా చేసినప్పుడు మోనోమర్స్ అనే అతి చిన్న అణువులు ఒకదానితో ఒకటి కలిసి పొడవైన, శక్తిమంతమైన 'పాలిమర్స్' అనే అణు గొలుసులు ఏర్పడతాయి. ఈ పాలిమర్లకు వివిధ రసాయనాలను కలపడం ద్వారా వేర్వేరు ధర్మాలు కలిగి ఉండే కృత్రిమ పదార్థాలు అంటే 'ప్లాస్టిక్ పదార్థాలు' తయారవుతాయి. ప్లాస్టిక్ స్వతహాగా విషపూరితం లేదా హానికరం కాదు. కాని రంగులు, పిగ్ మెంట్లు, ప్లాస్టిసైజర్లు, యాంటీ ఆక్సిడెంట్లు, స్టెబి లైజర్లు మరియు ధాతువుల వంటి ఎడిటివ్ల తో ప్లాస్టిక్ సంచులు తయారు చేస్తారు. ప్లాస్టిక్ సంచులకి రంగుని ఇవ్వడానికి ఉపయోగించే రంగులు మరియు పిగ్ మెంట్లు, పారిశ్రామిక ఎజోడైలు. ఇందులో కొన్ని కేన్సరు కలుగచేసే పధార్థాలు ఉన్నాయి. ఈ సంచులలో ఆహార పదార్థాలు కట్టినప్పుడు అవి కలుషితమౌతాయి. పిగ్మెంట్లలో ఉండే కాడ్మియం వంటి బరువైన ధాతువులు కూడా చేరి ఆరోగ్యానికి హానికరమౌతాయి. ప్లాస్టిసైజర్లు అనేవి తక్కువ బాష్పశీల స్వభావముగల సేంద్రీయ ఎస్టర్లు. అవి, ఆహార పదార్థాలకి శ్రవించిడం ద్వారా వలస పోగలుగుతాయి. ప్లాస్టిసైజర్లలో కూడా కేన్సరు కలుగ చేసే పదార్థాలని కలిగి ఉంటాయి.

కాడ్మియం మరియు సీసం వంటి విషపూరిత ధాతువులు, ప్లాస్టిక్ సంచుల తయారీలో ఉపయోగించినప్పుడు కూడా స్రవించి ఆహార పదార్థాలను కలుషితం చేస్తాయి.

**పాస్టిక్ రహిత సమాజం**
**పర్యావరణ హిత ప్రపంచం**

జె.ఎస్.ఎన్.మూర్తి

(జె.ఎస్.ఎన్. మూర్తి, IFS)

**ముఖ్య అటవీ సంరక్షణాధికారి, రాజమండ్రి**
**చీఫ్ ఎడిటర్- వనసంరక్షిణి**

# భావితరాల భద్రతకు వాల్టా యాక్టు

(మొదటి పేజీ తరువాయి)

...ిష్టంలోని అన్ని బావులు వారి యజమానులు, తమ బావులు, ...ాటర్ బాడీలను రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. కొన్ని ...దేశాలలో మోటార్ల ద్వారా నీటిని వెలికి తీయుట వలన ...ూగర్భ జలాలు అడుగంటుతాయని లేక ప్రకృతి వనరులు, ...ర్యావరణం దెబ్బ తినవచ్చని భావిస్తే అథారిటీ అనుమతితో ...యా చర్యలను నిషేధించవచ్చు. ఈ నిషేధం ఆరు నెలలు ...ంచకుండా ఎప్పటికప్పుడు పొడిగించవచ్చు.

...టి నిల్వలు క్షీణించిన (Over Exploited Area) ఏదైనా ...ాంతంలో సాంకేతిక అధికారి సలహాలను అనుసరించి భూగర్భ ...ల ప్రాంతమును (Ground Water Basin) అథారిటీ ప్రకటిం...వచ్చు. ఒక ప్రాంతంలో నీటి నిల్వలు క్షీణించినట్లయితే అక్కడి ...ర్షపాతం మోతాదు, ఏ స్థాయిలో నీరు వెలికి తీయబడుతుంది ...ంటి అంశాలను పరిగణనలోకి తీసుకొని అథారిటీ తగు సూచ...లు, సలహాలు ఇస్తుంది. ఆయా ప్రాంతాలలో భూగర్భజలాల ...భివృద్ధి పరిశీలనకు మార్గదర్శకాలను అథారిటీ సూచిస్తుంది. ...న్ని ప్రత్యేక సందర్భాలలో నిషేధం కూడా విధిస్తుంది. పైరుతో ...ండి ఉన్న పొలాలకు నీట సరఫరా చేస్తున్న సందర్భాల్లో వ్యవసా...య బావిపై నిషేధం విషయంలో సడలింపు ఉంటుంది.

...హుళ అంతస్తుల భవన ప్రాంగణం నుండి భూగర్భ జలాలను ...లికి తీసి ప్రాంగణం వెలుపల వాణిజ్య పరంగా విక్రయించ...న్ని నిషేధిస్తుంది. తాగునీటి లభ్యతను బట్టి ప్రజలకు నీటి ...ంపిణీ నిమిత్తం ఏదైనా బావిని అథారిటీ నియంత్రించవచ్చు.

...ూగర్భ జలవనరుల వృద్ధికి గృహ, వాణిజ్య సముదాయాలు, ...హిరంగ ప్రదేశాల్లో (కనీసం 200 చ.మీ.,) వర్షపు నీట ...ంకుడుగుంతల ఏర్పాటుకు మార్గదర్శకాలను జారీ చేయవ...చ్చును. కార్పొరేషన్లు, మున్సి పాలిటీలు ఇతర స్థానిక సంస్థల ...రిధిలో 200చ.గ.ల కంటే ఎక్కువ విస్తీర్ణం ఉన్న స్థలం లో ...ండ్లనిర్మాణానికి అనుమతిం చేటపుడు నీటి సంరక్షణకు, తగిన ...ర్పాట్లు ఉండి తీరాలనే నిబంధనను (Rain Water Harvesting Structures and or Roof top harvesting strucutres) పొందుపరచవచ్చు. నీటిని కలుషితం చేసేవారిపై చర్య తీసుకొనవచ్చు. కొన్ని సరస్సులు, గ్రామకుంటలు, మైనరు ఇరిగేషన్ చెరువులు, మంచినీటి మరియు మురుగునీటి కాలువల లక్ష్యాన్ని సంరక్షించడంలో భాగంగా వాటిని సాంస్కృతిక సంపదగా నోటిఫై చేయవచ్చు. అలాగే భూగర్భజలాల రక్షణకు నదులు, కాలువల నుండి ఇసుక తీతపై ఆంక్షలు విధించవచ్చు.

వృక్షములు (Trees) : కలప జాతికి చెందినవన్నీ వృక్షములే. (Any woody plant). కనీసం 5.5సెంటీ మీటర్లు వ్యాసార్ధము కలిగి, భూమి నుండి ఒక మీటరు కన్నా ఎత్తు పెరిగి ఉండాలి. చెట్టు కొమ్మలన్నీ దాని మ్రానుపై ఆధారపడి ఉండాలి. స్థలాల్లో పెంచే పిల్ల మొక్కలు, నారు మొక్కలు కూడా (Young Saplings, Seedlings, etc.,) వృక్షాలే. చెట్ల పెంపకం స్థల విస్తీర్ణం బట్టి ఉంటుంది. విస్తీర్ణంతో పాటు పెంచాల్సిన చెట్ల సంఖ్య పెరుగుతుంది. అనవసరంగా మొక్కల్ని, వృక్షాల్ని కొట్టివేయరాదు.

**సెక్షన్ 28: పట్టణ ప్రాంతాల్లో మొక్కలు నాటుట:**

1) భవన నిర్మాణాల అనుమతికి తప్పనిసరిగా మొక్కలను నాటి, పెంచేలా షరతు పెట్టాలని స్థానిక సంస్థలను ఆదేశించవచ్చు.

2) స్థానికసంస్థలు మొక్కలు నాటే అధికారిని నియమించుకోవాలని కూడా ఆదేశించవచ్చు. 3) ప్రభుత్వ ప్రయివేటు స్థలాల్లో మొక్కలు నాటడం, పచ్చదనం రక్షణ కోసం స్థానికసంస్థలన్నీ చర్యలు తీసుకోవాలి. ప్రభుత్వ, ప్రయివేట్ సంస్థలకూ మొక్కలు నాటమని ఆదేశాలివ్వాలి. వీటిని ఉల్లంఘిస్తే సందర్భానుసారం సదరు స్థానిక సంస్థలే మొక్కలను నాటి, ఆ ఖర్చులను పెనాల్టితో సహా వసూలు చేయాలి. 4) పట్టణాలలో, బహిరంగ ప్రదేశాలలో, రోడ్డు మార్జిన్లలో మొక్కలను స్థానికసంస్థలే నిర్వహించాలి. 5) అథారిటీ అనుమతి పొందనిదే మొక్కలను నరకరాదు. ఒక వేళ వృక్షాన్ని నరికితే ఒకదానికి 2 నాటాలి. ఇది 30 రోజుల్లో జరగాలి. నాటటం సాధ్యంకాకుంటే ఆ మొక్కలను బహిరంగ ప్రదేశాల్లో నాటి పెంచడానికి అయ్యే ఖర్చు నరికిన వ్యక్తి లేదా సంస్థ నుంచి వసూలు చేయాలి.

6) ప్రభుత్వ, ప్రవేటు రంగ సంస్థలు, పాఠశాలలు, కళాశాలలు, ఇతర ప్రాంగణాలు, బహిరంగ స్థలాల్లో మొక్కలను నాటడం, తోటలు పెంచటం, ఉన్నవాటిని రక్షించటం, మొదలైనవి చేపట్టడానికి అథారిటీ సూచనలు చేయాలి. వాటి అమలు సదరు సంస్థ యొక్క అధిపతి బాధ్యత. 7) బహిరంగ ప్రదేశాలలో మొక్కలను నాటి, సంరక్షించాలని స్థానికసంస్థల్ని ఆదేశించవచ్చు.

**సెక్షన్ 29 : వృక్షాల మనుగడకు భరోసా**

1) రోడ్లు భవనాలు, ఇంధన, టెలీకమ్యూనికేషన్స్, విద్యుత్, ఇరిగేషన్ శాఖలు, ప్రభుత్వ ప్రవేటు సంస్థలు, వ్యక్తులు, ఆర్గనైజేషన్లు, ప్రభుత్వ శాఖలు మౌలిక సదుపాయాలను అభివృద్ధి చేసే క్రమంలో వృక్షాలకు, వాటి మనుగడకు నష్టం లేకుండా చూడాలి.

2) రోడ్ల నిర్మాణం, వైండింగ్‌లో వృక్షాన్ని తొలగించాల్సివస్తే అలాంటి చెట్టు పెరగడానికి తగు మార్గదర్శకాలు జారీ చేయొచ్చు.

**సెక్షన్ 30 : ప్రభుత్వ శాఖలచే మొక్కల పెంపకం**

1) రోడ్డు మార్జిన్లు, కాలువ, చెరువు గట్లు, వాటర్ బాడీల వద్ద మొక్కలను పెంచడానికి మార్గదర్శకాలను అథారిటీ రూపొందిస్తుంది. మొక్కలను నాటి, అభివృద్ధి పరచడానికి అయ్యే ఖర్చును రోడ్డు, కాలువలు, చెరువుల ఖర్చులలో కలపాలి. నిబంధనల మేరకు చిల్లర ఖర్చులు, ఊహించని ఆపత్కాల ఖర్చులనుండి కొంత నిర్దిష్ట మొత్తాన్ని దీనికి కేటాయించుకోవలసి ఉంటుంది.

2) వాటర్ బాడీలకు చెందిన ఫోర్‌షోర్ ఏరియాలలో తప్పక మొక్కలు పెంచాలని స్థానికంస్థలను అథారిటీ ఆదేశించవచ్చును.

3) చిన్న, సన్నకారు, మాగాణి రైతులు మినహాయించి మిగిలిన వ్యవసాయదారులంతా తమ భూమి విస్తీర్ణంలో 5శాతం వరకు మొక్కలను నాటాలి. మొక్కను తొలగిస్తే మరొకటి నాటాలి. వృక్షాలకు ఎంతశాతం కేటాయించాలో నిర్ధారించే క్రమంలో భూమిలో అప్పటికే ఉన్న చెట్లు, పండ్లతోటల విస్తీర్ణం పరిగణన లోకి వస్తుంది. భిన్న తరహా వృక్షాలను, మొక్కలను నాటే రైతులకు ప్రోత్సాహకాలను కూడా ప్రకటించవచ్చు.

ఈ వాల్టా యాక్టు సక్రమంగా అమలవుతున్నదా అంటే లేదనే చెప్పాలి. ఈ నిబంధనలన్నీ పాటిస్తే రాష్ట్రం సస్యశ్యామలమే. కనీసం ఒక చెట్టు నరికితే, రెండు చెట్లు నాటాలనే నిబంధనైనా అమలు చేస్తే హరితాంధ్రప్రదేశ్‌ను కొన్నేళ్ళకైనా చూడగలం.

**– ఎ.పద్మజ**
సూపరింటెండెంట్, కృష్ణా డివిజన్, విజయవాడ.



## మడ అడవుల్లో నీటి పిల్లుల గణనకు

# నెలరోజుల ప్రణాళిక

నీటిపిల్లులు పిల్లి జాతికి చెందిన ఆ ప్రత్యేక జంతువులు. ఇవి చిత్తడి నేలలు, మడ అడవుల్లో ఎక్కువగా కనిపిస్తాయి. తూర్పు గోదావరి జిల్లాలోని కోరింగ అభయారణ్యం ప్రత్యేకంగా చిత్తడి నేలల్లో పెరిగే మడ అడవుల సమూహం. విస్తీర్ణం రీత్యా భారతదేశంలో సుందర్ బన్ (పశ్చిమ బెంగాల్) అడవుల తర్వాత కోరింగ అభయారణ్యమే పెద్దది. సుమారు 59 వేల ఎకరాల్లో ఇది విస్తరించి ఉంది. ఇటువంటి మడ అడవులు, చిత్తడి నేలల్లో కనిపించే నీటి పిల్లులు (ఫిషింగ్ క్యాట్) ప్రపంచవ్యాప్తంగా ఇప్పుడు అత్యంత ప్రమాదకర పరిస్థితులను ఎదుర్కొంటూ అంతరించి పోయే పరిస్థితికి చేరుకున్నాయి. అయితే గోదావరి ముఖద్వారంలోని చిత్తడి నేలలైన కోరింగ అభయారణ్యం వీటికి రక్షణ స్థావరంగా ఉన్నందున ఇక్కడ వీటి జనాభా, జీవన పరిస్థితుల అధ్యయనం ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొన్నది. ఈ ప్రాంతంలో ఎక్కువగా నీటిపిల్లులు ఉన్నాయని భావిస్తున్నప్పటికీ వీటి జీవన విధానం, ఆవాసాలు, ఎదుర్కొంటున్న ఇబ్బందులు, ఇతర పరిస్థితులను గురించి తెలిసింది చాలా తక్కువ. ఈ నేపథ్యంలో ఆంధ్రప్రదేశ్ అటవీ శాఖ కోరింగ వన్య ప్రాణి అభయారణ్యంలో నీటి పిల్లుల గణనకు పూర్తిస్థాయి కార్యక్రమాన్ని చేపట్టింది. జూన్ 8వ తేదీ నుంచి నెలరోజుల పాటు జరిగే ఈ గణన కార్యక్రమం నీటి పిల్లులకు సంబంధించి దేశంలో అతి పెద్దది, ప్రాధాన్యమైనది కావడం విశేషం. ఈ కార్యక్రమం గురించి వన్యప్రాణి సంరక్షణ విభాగం డిఎఫ్ఓ శ్రీ అనంత్ శంకర్ మాట్లాడుతూ... నీటి పిల్లుల గణన కోసం పెద్ద ఎత్తున కెమెరా ట్రాప్స్ ఏర్పాటు చేయడం జరిగిందన్నారు. మొత్తం 235 చదరపు కిలోమీటర్ల అభయారణ్యపు లోపలి భాగం అంతా కవర్ చేసేలా... గ్రిడ్లను ఉపయోగించి తుల్యభాగ, కోరింగ, గడేరు డిస్ట్రిబ్యూటరీ కెనాల్స్ వెంబడి మొత్తం 120 చోట్ల ఈ ట్రాప్స్ ఏర్పాటు చేశామన్నారు. అత్యంత క్లిష్టమైన, విస్తారమైన కెమెరా ట్రాపింగ్ ఆపరేషన్ ద్వారా నిర్వహిస్తున్న ఈ గణనలో అటవీ శాఖ క్షేత్రస్థాయి సిబ్బందితో పాటు స్థానిక మత్స్యకారులు, స్వచ్ఛంద కార్యకర్తల సేవలను కూడా వినియోగించుకుంటున్నామని తెలిపారు. ఇందుకోసం వారికి ప్రత్యేకంగా శిక్షణ కూడా ఇచ్చామన్నారు. నీటిపిల్లుల సంరక్షణలో మత్స్యకారులు, సమీప గ్రామాల



ప్రజల పాత్ర చాలా ముఖ్యమని తెలిపారు. అభయారణ్యంలో నేచర్ గైడ్స్‌గా, మడ మొక్కల పెంపకంలో ఇంకా టూరిజం అభివృద్ధి కార్యక్రమాల్లో పలువురు స్థానికులకు ఉపాధి, ఆదాయ వనరులకు అవకాశం కల్పించడం జరుగుతోందన్నారు. కోరింగ అభయారణ్యం మస్కట్ గా ఫిషింగ్ కేట్ ను ఎంపిక చేసి మచ్చా ద ఫిషింగ్ కేట్ నినాదంతో విస్తృత ప్రచారం కల్పించామన్నారు. ఇది అభయారణ్యానికి మరింత పేరు తేవడమే కాకుండా సందర్శకులతో సహా ప్రతి ఒక్కరికీ నీటి పిల్లుల గురించి తెలుస్తుందన్నారు.




ఈ ప్రాంతంలో నీటి పిల్లులకు ప్రధానంగా ఎదురవుతున్న ప్రమాదం చిత్తడి నేలలు, మడ అడవులు ఆక్రమణలకు గురై కుంచించుకు పోతుండడమేనని శ్రీ అనంతశంకర్ తెలిపారు. ఆసియా ఖండంలో దాదాపు 50 శాతం చిత్తడి నేలలు ఆక్రమణ ముప్పుని ఎదుర్కొంటున్నాయన్నారు.

తూర్పు గోదావరి జిల్లాలోని మడ అడవులు కూడా ఆక్వా సాగు, తీరపు కోత వంటి కారణాల వలన కొంతమేర ఆక్రమణలకు గురైనాయని పేర్కొన్నారు. దాదాపు 264 పక్షి జాతులకు, నీటి కుక్కలు, నీటి పిల్లులు ఇంకా మడ పాము తదితర జంతు జలానికి, విభిన్నమైన వృక్ష జాతులకు ఆలవాలంగా ఉండడంతో గోదావరి ప్రాంత మడ అడవులు అంతర్జాతీయ స్థాయి ప్రాముఖ్యతను సంతరించుకున్నాయని చెప్పారు. జల కాలుష్యం కారణంగా నీటి కుక్కలు కూడా తమ ఆవాసాలను కోల్పోతూ ప్రమాదకర పరిస్థితిని ఎదుర్కొంటున్నా యన్నారు. ఫిషింగ్ కాట్ జాతి కి కోరింగ అభయారణ్యం ఉత్తమ రక్షిత ఆవాసాలలో ఒకటిగా ఉంది.

గతంలో నిర్వహించిన వివిధ అధ్యయనాల్ల ప్రకారం, ఫిషింగ్ కాట్ యొక్క ఉనికి నేరుగా మడ అటవీ హారంతో సంబంధం కలిగి ఉంటుంది. ఫిషింగ్ క్యాట్ ఎదుర్కొంటున్న ప్రమాదాలు, మరియు రక్షిత ప్రాంతాల వెలుపల గల మడ అడవుల రక్షణ గురించి మరింత అవగాహన ఏర్పడితే ఈ జాతి మనుగడకు భద్రత చేకూరుతుందని వన్యప్రాణి విభాగం డిఎఫ్ఓ శ్రీ అనంతశంకర్ పేర్కొన్నారు.

## పచ్చని చెట్టు (గేయం)

మంట పెట్టిపోతున్న మనిషీ నీవు ఆగుము
చెట్టు నరికిపోతున్న నరుడా నీవు ఆగుము
తప్పదు నీకు ఈ ముప్పు.. తెలుసుకో నీ తప్పు
పల్లవి :
"కన్నావా నన్ను కొన్నావా
పెంచావా, పోషించావా"
నరకడానికి నీకు ఎవరిచ్చారు హక్కునీ
తోడులేని వారికి అవుతాను నీడనీ"
॥ కన్నవా ॥
చ :"ఆకలితోను ఉన్నప్పుడు
పండును నేనిచ్చాను
ఎండలో నీవున్నప్పుడు
గొడుగును నేనయ్యాను"
గొడ్డలితో నీవు నరుకుతుంటే
నీ గడ్డం పట్టి ఏడ్చాను
ఎంతయ్య నీ లాభం
చెట్టు మీదా వ్యాపారం?
॥ కన్నవా ॥
చ : సమస్త జీవరాశులకు ఆయుపట్టు
నేనన్నావు
వనాలు వర్షానికి మూలమనీ అన్నావు
నేటి అవసరం కోసం నిప్పు నీవు అంటిస్తే
చెట్లేమో అగ్గిపాలు, మీ బతుకులు
బుగ్గిపాలు
॥ కన్నవా ॥
చ : గుడిలోన నేనుంటే
వనదేవతనని పూజిస్తావు
మరి గట్టున నేనుంటే పనిముట్టుగ
నరికేస్తావు
విషవాయువును నేను దిగమింగి,
ప్రాణవాయువును మీకు ఇస్తాను
నిత్యం సుఖం వుండేటట్టు,
చెట్టే ప్రగతికి మెట్టు
అమాయకులు తెలుసుకుంటే గుట్టు
హరితహారమే అవుతుంది పచ్చని చెట్టు

రచన : రాజ్‌కుమార్



స్ట్రయికింగ్ ఫోర్స్ (పిడబ్ల్యూ)
రాయచోటి






## కలప ఆధారిత పరిశ్రమల నిర్వాహకులు

# నిబంధనలు పాటించాలి

- ముఖ్య అటవీసంరక్షణాధికారి జెఎస్ఎన్ మూర్తి
- కలప ఆధారిత పరిశ్రమల నిబంధనలపై వర్క్‌షాప్

సామిల్లుల నిర్వాహకులు ప్రభుత్వ నిబంధనలను సక్రమంగా పాటించడం ద్వారా వనసంరక్షణకు చేయూతను అందించాలని రాజమండ్రి సర్కిల్ ముఖ్య అటవీ సంరక్షణాధికారి శ్రీ జెఎస్ఎన్ మూర్తి అన్నారు. ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ (దివాన్ చెరువు) ఆధ్వర్యంలో "కలప ఆధారిత పరిశ్రమల నియమ నిబంధనలు వాటి సవరణలు - ఇతర అటవీ నిబంధనలు" అనే అంశంపై గురువారం రాజమండ్రి ముఖ్య అటవీ సంరక్షణాధికారి కార్యాలయ కాన్ఫరెన్స్ హాల్లో వర్క్ షాప్ నిర్వహించారు. ఈ వర్క్‌షాప్‌కు శ్రీ మూర్తి ప్రారంభోపన్యాసం చేస్తూ, ప్రభుత్వం సామిల్లు నిబంధనల స్థానే కలప ఆధారిత పరిశ్రములుగా విస్తృత నిర్వచనం ఇస్తూ తాజా ఉత్తర్వులను మే నెల 11న విడుదల చేసిందన్నారు. ఈ నిబంధనల ప్రకారం రెండు మాసాల్లోగా అంటే జూలై 11లోగా అన్ని కలప ఆధారిత పరిశ్రమలు లైసెన్స్ కోసం దరఖాస్తు చేసుకోవలసి ఉందన్నారు. అధికారులు, సామిల్లుల నిర్వాహకులు కూడా ఈ నిబంధనలపై పూర్తి సదవగాహన ఏర్పరచుకోవాలన్నారు. . ఇబ్బందికరమైన నిబంధనల విషయంలో మార్పుల కోసం ప్రభుత్వాన్ని కోరేందుకు అవకాశం ఉందని ఆయన తెలిపారు. అకాడమీ డిప్యూటీ డైరెక్టర్, ఫ్లయింగ్ స్క్వాడ్ ఇన్‌చార్జి డిఎఫ్ఓ శ్రీ ఎంవి ప్రసాదరావు అధ్యక్షత వహించారు. ఆయన మాట్లాడుతూ నిబంధనలపై కలప ఆధారిత పరిశ్రమల యజమానులు, సామిల్లుల నిర్వాహకులకు సదవగాహన కల్పించడం లక్ష్యంగా ఈ వర్క్‌షాప్ నిర్వహిస్తున్నామన్నారు. ఈ వర్క్ షాప్ లో ఉభయ గోదావరి, కృష్ణా జిల్లాల పరిధిలోని (రాజమండ్రి అటవీ సర్కిల్) డీఎఫ్ఓలు, సహాయ అటవీ సంరక్షణాధికారులు, సబ్ డీఎఫ్ఓలు , రేంజ్ అధికారులు, డెప్యూటీ రేంజర్లు, ఇంకా కలప ఆధారిత పరిశ్రమలు, సామిల్లుల అసోసియేషన్ల కార్యవర్గ ప్రతినిధులు పెద్దసంఖ్యలో పాల్గొన్నారు. కలప కోత, రవాణా తదితర ప్రక్రియల్లో పాటించాల్సిన నిబంధనలు, వివిధ ఉత్తర్వులు, చట్టాలను అలాగే గత నెలనుంచి కలప ఆధారిత పరిశ్రమలకు అమల్లోకి వచ్చిన పలు నిబంధనల గురించి అటవీశాఖ రిటైర్డ్ అధికారి డాక్టర్ ఆకుల కిషన్ ఈ వర్క్‌షాప్‌లో వివరించారు. ఈ సందర్భంగా సామిల్లుల నిర్వాహకులు, అటవీశాఖ క్షేత్రాధికారులకు వివిధ నిబంధనలను గురించి పలు సందేహాలను ఆయన నివృత్తి చేశారు.

కలప ఆధారిత పరిశ్రమను లైసెన్సు లేకుండా ఎవరూ నిర్వహించరాదని ఈ నిబంధనల్లో స్పష్టంగా ఉందన్నారు. ఇప్పటికే నిర్వహణలో ఉన్న కలప ఆధారిత పరిశ్రమల యజమానులందరూ ఈ నిబంధనలు అమలులోకి వచ్చిన అరవై రోజుల్లోగా సంబంధిత అధికారులనుంచి తప్పనిసరిగా లైసెన్సు పొందాలని తెలిపారు. సామిల్లు లేదా కలప ఆధారిత పరిశ్రమ వార్షిక సామర్థ్యం ప్రాతిపదికగా 1000 క్యూబిక్ మీ॥ వరకు రూ. 5000, 1000 క్యూబిక్ మీటర్లకు పైబడి రూ.10,000 లైసెన్సు ఫీజు / రెన్యువల్ ఫీజుగా నిర్ణయించిందని కిషన్ చెప్పారు. కలప ఆధారిత పరిశ్రమల నిబంధనల అమలుకు గాను కేంద్రప్రభుత్వ సూచనల మేరకు రాష్ట్రస్థాయి కమిటీ ఏర్పాటవుతుందన్నారు. దీనికి ప్రధాన ముఖ్య అటవీ సంరక్షణాధికారి (రాష్ట్ర అటవీ దళాధిపతి) చైర్మన్‌గా ఉంటారన్నారు. అటవీ శాఖ ప్రధాన కార్యాలయ కన్సర్వేటర్ సభ్యకార్యదర్శిగా ఉంటారని, మరో ఏడుగురు వ్యవసాయ, రెవెన్యూ, అటవీ శాఖాధికారులు సభ్యులుగా ఉంటారని తెలిపారు. కలప వ్యాపారులు/ కలప ఆధారిత పరిశ్రమల ఫెడరేషన్ నుంచి ఇద్దరిని సభ్యులుగా తీసుకుంటారన్నారు. గతంలో సామిల్లుల నిర్వాహకుల్ని ఆహ్వానితులుగా మాత్రమే కమిటీలో వేసేవారని, ఇప్పుడుపూర్తిస్థాయి సభ్యులుగా తీసుకోవడం విశేషమని తెలిపారు.

కలప ఆధారిత పరిశ్రమల కలప అవసరాన్ని నిర్ధారించే క్రమంలో వాటిని 10 హెచ్‌పి వరకు, 10-20 హెచ్‌పి, 20-40 హెచ్‌పి, 40- 60 హెచ్‌పి, 60 హెచ్‌పి పైబడి అనే కేటగిరీల వారీగా విభజించడం జరిగిందన్నారు. ఈ వర్క్‌షాప్‌లో విజయవాడ డిఎఫ్ఓ పిఎ బెనర్జీ, ఏలూరు డిఎఫ్ఓ నాగేశ్వరరావు, కాకినాడ ఎసిఎఫ్ టి శ్రీనివాసరావు, సబ్ డిఎఫ్ఓ శామ్యూల్, అకాడమీ ఎఫ్ఎస్ఓ ప్రసాద్, సామిల్లుల యజమానుల సంఘ రాష్ట్ర నాయకులు ద్వారా రామకృష్ణ, పిసిహెచ్ సూర్యారావు తదితరులు పాల్గొన్నారు.

## 30న సిసిఎఫ్ శ్రీ జెఎస్ఎన్ మూర్తి పదవీ విరమణ

(మొదటి పేజీ తరువాయి) ఫారెస్ట్రీలో శిక్షణ పొందారు (1-1-84 నుంచి 31-12-85). ఆ తర్వాత ఆదిలాబాద్ జిల్లా చిన్నూర్ సబ్ డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసంగా (1987), హైదరాబద్ పిసిసిఎఫ్ కార్యాలయంలో ఎసిఎఫ్‌గా (1989), ఎపి స్టేట్ ఎస్‌సి ఫైనాన్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (కడప) కార్యనిర్వాహక సంచాలకునిగా(1991) పనిచేశారు. అదే హెూదాలో శ్రీకాకుళం జిల్లాకు 1993లో బదిలీ అయ్యారు. ఎపి స్టేట్ హౌసింగ్ కార్పొరేషన్ లిమిటెడ్ శ్రీకాకుళం జిల్లా మేనేజర్‌గా 1996 నుంచి మూడేళ్ళకుపైగా విధులు నిర్వర్తించారు. 1999 డిసెంబర్ 15న మెదక్ జిల్లాలో డివిజనల్ అటవీఅధికారిగా చేరారు. స్టేట్ సిల్వికల్చరిస్ట్‌గా హైదరాబాద్‌లో, డిఎఫ్ఓగా మహబూబ్‌నగర్, హైదరాబాద్, ఏలూరు, కాకినాడల్లో, తదుపరి కాకినాడ, రాజమండ్రి కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్‌గా, రాజమండ్రి ఎపిఎఫ్‌డిసి రీజినల్ మేనేజర్‌గా పనిచేశారు. అనంతరం ముఖ్య అటవీ సంరక్షణాధికారిగా పదోన్నతి పొంది కర్నూలులో పనిచేశారు. తదుపరి రాజమండ్రి సర్కిల్‌కు సిసిఎఫ్‌గా వచ్చారు. ఆరుమాసాల కిందట ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ డైరెక్టర్‌గా అదనపు బాధ్యతలను చేపట్టారు. ఎక్కడ ఏ విభాగంలో పనిచేసినా తనకు నిర్దేశించిన లక్ష్యాలను సాధించడమేకాక అధిగమించడం, తర్వాత ఆ స్థానాల్లో వచ్చేవారికి మరింత మెరుగైన లక్ష్యాలను నిర్ణయించడం ఆయన ప్రత్యేకత. విధినిర్వహణలో ఉత్తమసేవలకు రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రశంసలను కూడా అందుకున్నారు. శ్రీ జెఎస్ఎన్ మూర్తి పదవీవిరమణ సందర్భంగా 30వ తేదీ సాయంత్రం 6గంటలకు రాజమహేంద్రవరంలోని జెకె కాన్ఫరెన్స్ హాల్లో సర్కిల్ పరిధిలోని అటవీశాఖ సిబ్బంది, అధికారులు సాదరపూర్వక వీడ్కోలు సభ నిర్వహిస్తున్నారు.

# ప్లాస్టిక్ కాలుష్య నిర్మూలనకు ప్రతిజ్ఞ

## నగరవనం, అకాడమీ ఆవరణల్లో వ్యర్థాల ఏరివేత


కాకినాడలో ర్యాలీ

మానవాళి మనుగడకు, జీవవైవిధ్యం ఉనికికి పెనుముప్పుగా పరిణమించిన ప్లాస్టిక్ కాలుష్యాన్ని నిర్మూలిస్తామని, ప్రతిరోజూ ప్లాస్టిక్‌పై పోరాటం కొనసాగిస్తామని అటవీశాఖ సిబ్బంది, అధికారులు ప్రతిజ్ఞ చేశారు. మంగళవారం ప్రపంచ పర్యావరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని రాజమండ్రి అటవీ సర్కిల్ పరిధిలో శాఖ అధికారులు, సిబ్బంది వివిధ కార్యక్రమాలను నిర్వహించారు. రాజమహేంద్రవరం మహాపుష్కర నగరవనంలో ఉదయం నుంచీ ప్లాస్టిక్ కాలుష్యాన్ని తరిమికొడదాం అనే నినాదంతో ప్రపంచ పర్యావరణ దినోత్సవ కార్యక్రమాన్ని చేపట్టారు. రాజమండ్రి సర్కిల్ ముఖ్య అటవీసంరక్షణాధికారి, అటవీ అకాడమీ ఇన్‌చార్జి డైరెక్టర్ జెఎస్ఎన్ మూర్తి, డిప్యూటీ డైరెక్టర్లు ఎంవి ప్రసాదరావు, ఎం.శ్రీనివాసరావు, లైఫ్ స్కిల్స్ ఎంఎల్‌వి ట్రెయినర్ సురేష్, సిల్వికల్చర్ స్పెషలిస్ట్ శ్రీహరిగోపాల్, నగరవనం ఎఫ్ఆర్ఓ శ్రీసాయి, ఎఫ్ఎస్ఓ ప్రసాద్, రిసెర్చ్ అసిస్టెంట్ బాలాజీ తదితరులు పాల్గొన్నారు. తొలుత ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీలో శిక్షణ పొందుతున్న ఎఫ్‌బిఓలు, ఎఫ్ఎస్ఓలు పెరేడ్ నిర్వహించారు. ప్రతిరోజూ ప్లాస్టిక్ కాలుష్య నివారణకు పాటుపడతామని, పర్యావరణాన్ని పరిరక్షిస్తామని, జీవ వైవిధ్యానికి రక్షగా ఉంటామని వారితో అధికారులు ప్రతిజ్ఞ చేయించారు. అనంతరం నగరవనంలో, ఫారెస్ట్ అకాడమీలో, ఇంకా నేషనల్ హైవే ఇరుప్రక్కలా ప్లాస్టిక్ వ్యర్థాల ఏరివేత కార్యక్రమం పెద్ద ఎత్తున జరిగింది. వాకర్లు, సందర్శకులు, విద్యార్థులతో కలసి శిక్షణలో ఉన్న ఫారెస్టు అధికారులు ఈ ఏరివేతలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా సిసిఎఫ్ శ్రీ జెఎస్ఎన్ మూర్తి మాట్లాడుతూ ప్లాస్టిక్ ఫ్రీజోన్‌గా నగరవనం, అకాడమీ పరిసరాలను, ఇంకా ఎకో టూరిజం స్పాట్‌లను గుర్తించినందున ఆయా ప్రాంతాల్లో ప్లాస్టిక్ వినియోగాన్ని పూర్తిగా నివారించాలని సూచించారు. ప్లాస్టిక్ వస్తువుల వాడకం వలన పర్యావరణానికి, భావి తరాలకు వాటిల్లే ముప్పును విస్తృతంగా ప్రచారం చేసి సదవగాహన కల్పించాలని సూచించారు.



నగరవనంలో ప్రతిజ్ఞ

### కాకినాడలో ప్లాస్టిక్ వ్యతిరేక ర్యాలీ

కాకినాడలో ధాత్రి ఫౌండేషన్ జరిగిన ప్లాస్టిక్ కాలుష్య వ్యతిరేక ర్యాలీలో రాజమండ్రి వైల్డ్‌లైఫ్ మేనేజ్‌మెంట్ విభాగం డిఎఫ్ఓ శ్రీఅనంతశంకర్ పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కోరింగ అభయారణ్యాన్ని ప్లాస్టిక్ రహిత ప్రాంతంగా గుర్తించామన్నారు. ఈ దృష్ట్యా ఈ ప్రాంతంలో, పరిసరాల్లో ప్లాస్టిక్ వాడకాన్ని, ప్లాస్టిక్ వ్యర్థాలను పూర్తిస్థాయిలో నియంత్రించాలని కోరారు. వాడి పారేసే ప్లాస్టిక్ అవశేషాలు భూమిలో వేల సంవత్సరాలకు కూడా కలవవన్నారు. దీనివలన ప్రమాదకర పరిస్థితులు ఉత్పన్నమై భూమి జీవం కోల్పోతుందని, జలాలు విషతుల్యంగా మారుతున్నాయని తెలిపారు. మానవుల నిర్లక్ష్యం కారణంగా వన్య ప్రాణులు కూడా ప్లాస్టిక్ బారిన పడి ప్రాణాలు కోల్పోతున్నాయన్నారు. ఏ రూపంలోనూ ప్లాస్టిక్ వ్యర్థాలు చెత్తలో కలవకుండా చూడాలని, వాటికి ప్రత్యామ్నాయాల వినియోగంపై ప్రజల్లో అవగాహన కల్పించాలని అధికారులకు సూచించారు. ధాత్రి ఫౌండేషన్ అధ్యక్షురాలు సీమకుర్తి సురేఖ, కాలుష్య నియంత్రణ బోర్డు ఇఇ శ్రీ రామారావు నాయుడు, వైల్డ్‌లైఫ్ మేనేజ్‌మెంట్ విభాగం (కాకినాడ) రేంజ్ ఆఫీసర్ శ్రీ బివిడి ప్రసాద్, జెఎన్‌టియు సిబ్బంది, విద్యార్థులు, వివిధ పారిశ్రామిక సంస్థల ప్రతినిధులు ఈ ర్యాలీలో పాల్గొన్నారు. అనంతరం జెఎన్‌టియు ఆడిటోరియంలో నిర్వహించిన సదస్సులో విద్యార్థులకు నిర్వహించిన చిత్రలేఖన పోటీల విజేతలకు బహుమతి ప్రదానం జరిగింది. రాజమండ్రి సర్కిల్ కార్యాలయంలో కూడా పర్యావరణ దినోత్సవం నిర్వహించారు.


సర్కిల్ కార్యాలయంలో అవగాహన

# వన్యప్రాణుల సంరక్షణ





- 15 గుడ్లతో పాటు కొండచిలువను కాపాడిన అటవీ శాఖ
- పశు వైద్యుని సంరక్షణలో మాను పిల్లి

రాజమహేంద్రవరం నగరంలోని వివిధ ప్రాంతాల్లో జూన్ 15వ తేదీన వన్యప్రాణులను సంరక్షించారు. ధవళేశ్వరం ఇరిగేషన్ క్వార్టర్స్ ఏరియాలో కార్మికులు తవ్వకాలు జరుపుతూ ఉండగా కొండచిలువ (ఇండియన్ రాక్ పైథాన్) కనిపించింది. దీంతో పాటు కొన్ని గుడ్లు కూడా ఉన్నాయి. ఈ సమాచారం అందుకున్న రీసెర్చ్ సైంటిస్ట్ బాలాజీ, వెటర్నరీ డాక్టర్ ఏ ఫణింద్ర, దివాన్ చెరువు ఏరియా ఫారెస్ట్ గార్డ్ శ్రీనివాస్ తదితరులు వెళ్లి కొండచిలువను, 15 గుడ్లను నగరవనంలోని బయో డైవర్సిటీ రీసెర్చ్ ల్యాబ్ కు తరలించారు. ల్యాబ్ లో ప్రత్యేక కంటైనర్ లో ఈ పామును సంరక్షించి, తరువాత అడవిలో విడిచిపెట్టారు. గుడ్లు పిల్లలై న తర్వాత అడవిలో వదిలిపెడతామని అప్పటివరకూ సంరక్షిస్తామని తెలిపారు. దివాన్ చెరువు రిజర్వ్ ఫారెస్ట్ ఏరియాలోని కాలనీలో ఇంటి గోడపై ఉన్న తాడేలు పాము (బ్రాన్జ్ బ్యాక్ స్నేక్) ను కూడా వారు సురక్షితంగా పట్టుకొని అటవీ ప్రాంతంలో వదిలిపెట్టారు.

**మానుపిల్లి కూన అప్పగింత :** ఒక మాను పిల్లి కూనను



(ఆసియన్ పామ్ సివెట్) సంరక్షించారు. బలహీనంగా ఉన్న ఈ పిల్లి కూనను ప్రభుత్వ పశువైద్యుని సంరక్షణలో ఉంచామని రీసెర్చ్ సైంటిస్ట్ బాలాజీ తెలిపారు. ఇది కోలుకున్న అనంతరం అడవిలో వదిలిపెడతామన్నారు. రాజమండ్రిలోని క్వారీ మార్కెట్ ఏరియాలో కొందరు స్థానికులు దీనిని పట్టుకొని అటవీశాఖకు అప్పగించారు. ఎక్కడైనా వన్యప్రాణులు, పాములు కనిపిస్తే చంపవద్దని, వాటి సమాచారం అటవీశాఖకు అందజేయాలని అటవీఅధికారులు కోరారు.

# ఇవీ మన రాష్ట్ర చిహ్నాలు



వేప



కృష్ణజింక



రామచిలుక



మల్లె

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర చిహ్నాలను (స్టేట్ సింబల్స్) అధికారికంగా ప్రకటించింది. జిఓ ఎంఎస్ నంబర్59 (ది.30-5-2018) ఉత్తర్వులలో వీటిని ప్రకటించారు. రాష్ట్ర వృక్షంగా వేపచెట్టు, రాష్ట్ర జంతువుగా కృష్ణ జింక, రాష్ట్రపక్షిగా రామచిలుక, రాష్ట్రపుష్పంగా మల్లెపూవు ఎంపికైనాయి.**

## ప్లాస్టిక్ ప్రమాదం తప్పాలంటే...



ప్లాస్టిక్, పాలిథిన్ సంచులకు ప్రత్యామ్నాయంగా జనపనార లేదా క్లాత్ సంచులని వినియోగించడాన్ని అలవాటు చేయాలి. అది జరగాలంటే వీటి వినియోగం జనరంజకం కావాలి. అందుకోసం ఆర్థికపరమైన ఇన్సెంటివ్‌లతో ప్రేరేపించాలి. కాగితం సంచులు తయారీకి కూడా చెట్లని కొట్టి వాటిని ఉపయోగించడం జరుగుతుంది, కాబట్టి వాటి వినియోగాన్ని కూడా పరిమితం చేయాలి. ముఖ్యముగా బయోడిగ్రేడబుల్ ప్లాస్టిక్ సంచులని మాత్రమే ఉపయోగించాలి. ప్రస్తుతం బయోడిగ్రేడబుల్ ప్లాస్టిక్‌ని అభివృద్ధి చేయడానికి పరిశోధనలు జరుగుతున్నాయి. ఒక ప్లాస్టిక్ కవరు భూమిలో కలవాలంటే లక్షల సంవత్సరాలు పడుతుంది కనుక వీలైనంతవరకు ప్లాస్టిక్ వాడకాన్ని మనం తగ్గించాలి.

### బంగాళాదుంపలతో ప్లాస్టిక్

బంగాళాదుంపలతో క్యారీబ్యాగ్, స్పూన్స్‌లు, ప్లేట్స్, పిల్లల ఆట సామాగ్రిని కూడా తయారు చేసుకోవచ్చునని శాస్త్రవేత్తలు సూచిస్తున్నారు. పర్యావరణానికి ఇవి ఎలాంటి హాని చేయవు. వీటిని వాడి పడేసిన తర్వాత కొద్ది రోజులకే ఇవి చివికి, కరిగి భూమిలో కలిసిపోతాయి. అంతేగాకుండా వీటిని రిసైక్లింగ్‌కి (పునరుత్పత్తి ప్రక్రియ ) కూడా వాడవచ్చు. బ్రిటన్, జపాన్ దేశాలలో ప్రస్తుతం వీటిని విరివిగా వాడుతున్నారు. వీటిని అక్కడ 'స్పడ్‌వేర్ 'గా వ్యవహరిస్తున్నారు. నిజానికి ఇది సంప్రదాయ ప్లాస్టిక్ కంటే బలమైనది. మామూలు ప్లాస్టిక్ కంటే చవకగా కూడా దొరుకుతుంది. కిచెన్‌లో ఉపయోగించే కత్తులను సైతం పొటాటో, కార్న్ స్టార్చ్‌లతో అక్కడ తయారు చేస్తున్నారు. బంగాళదుంప నుండి తీసే స్టార్చ్ (పిండి పదార్థం) బయో పాలిమర్ ప్లాస్టిక్ లక్షణాలను కలిగి ఉంటుంది. బయో పాలిమర్‌కి భూమిలో త్వరగా కరిగిపోయే గుణం ఉన్నందువలన పర్యావరణానికి దీనివలన ఎలాంటి ప్రమాదమూ ఉండదు. పొటాటో ప్లాస్టిక్‌ను తయారు చేసుకోవడం కూడా చాలా సులభం. బంగాళదుంపలు, వెజిటబుల్ లిక్విడ్ గ్లిజరిన్, వైట్ వెనిగర్, ఫుడ్ కలరింగ్ తదితరాలను ఉపయోగించి ఈ పొటాటో ప్లాస్టిక్ తయారు చేసుకోవచ్చు.

# ఏపీ స్టేట్ ఫారెస్ట్ అకాడమీ ... ఐదుమాసాల్లో అద్వితీయ ప్రగతి

**(మొదటి పేజీ తరువాయి)** విస్తరణ కార్యక్రమాలకు అటవీ సిబ్బందిని సుశిక్షితులైన సైనికుల్లా తీర్చిదిద్దడం కోసం ఈ అకాడమీ అనివార్యమని ప్రభుత్వం గుర్తించింది. విధి నిర్వహణలో అటవీ సిబ్బంది విజయవంతం కావడం పైనే పర్యావరణం, పచ్చదనం, ప్రజారోగ్యం, భావితరాల భద్రత ఆధారపడి ఉన్నాయి. అందుకే ఈ అకాడమీని శీఘ్రంగా నెలకొల్పి పూర్తిస్థాయిలో అభివృద్ధి పరచాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తర్వులు 104 మరి యు 33 లలో లాలాచెరువులోని రీజనల్ అటవీ పరిశోధనా సంస్థలో ది.02-01-2017న అధికారికంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అటవీ శిక్షణ సంస్థ, రాజమహేంద్రవరం తాత్కాలిక వసతులతో ప్రారంభమైంది.

ప్రాంగణంలో నిరుపయోగంగా ఉన్న సీడ్ స్టోరేజిని రూ. 4.16 లక్షల వ్యయంతో పూర్తిస్థాయి సదుపాయాలతో డార్మి టరీ (వసతి గృహం) గా సిద్ధంచేసి అకాడమీలో శిక్షణ పొందుతున్న 20 మంది ట్రయినీలకు వసతి కల్పించడం జరిగింది.

అకాడమీని నిర్వహిస్తున్న ప్రాంగణంలోనే నిరుపయోగంగా ఉన్న కంపోస్టు యార్డును సుమారు రూ.10.40లక్షల వ్యయంతో అసెంబ్లీ హాల్ రూపొందించటం జరిగింది. ఈ పై రెండు భవనాలను అటవీ శాఖ మంత్రివర్యులు శ్రీ శిద్దా రాఘవరావు గారు ది.18-02-2018న ప్రారంభించుట జరిగింది. ఈ భవనం ప్రస్తుతం సమావేశ మందిరంగా, పరీక్ష హాలుగా, గెస్ట్ లెక్చర్లకు, డైనింగ్ కు ఇంకా స్నాతకోత్సవానికి .. ఇలా బహుముఖ సేవలను అందిస్తున్నది.

రూ.3.50 లక్షలతో బోర్డు మీటింగ్స్, శిక్షణలు, సభలు సమావేశాలకు అనువుగా మినీ సమావేశ మందిరాన్ని సుందరంగా తీర్చి దిద్దటం జరిగింది. ఈ హాలుకు దివంగత ఐ.ఎఫ్.ఎస్ అధికారి కూరాకుల వెంకయ్య స్మారక సమావేశ మందిరంగా పేరు పెట్టారు. దీనిని ది.30-04-2018 న అటవీ దళాధిపతి, ప్రధాన ముఖ్య అటవీ సంరక్షణాధికారి శ్రీ పి మల్లికార్జునరావు



ప్రారంభించారు.

రూ. 4.50 లక్షల వ్యయంతో అకాడమీ ప్రాంగణంలో ఆట స్థలాన్ని చదును చేసి ఆటల పోటీలు, పెరేడ్ నిర్వహణకు అనువుగా తయారుచేయుట జరిగినది. పెద్ద సభలు నిర్వహించుటకుగాను ఒక వేదికను కూడా నిర్మించుట జరిగినది.

అకాడెమీ సుందరీకరణలో భాగంగా ప్రాంగణాన్ని ఎప్పటికప్పుడు శుభ్రం చేస్తూ మొక్కలు, ఉద్యానవనాల పెంపకం ద్వారా కొత్త రూపు తేవడం జరిగింది. ఇందులో భాగంగా రూ. 2.50 లక్షలతో ఏర్పాటు చేసిన బటర్ ఫ్లై పార్క్ సందర్శకులను ఆకర్షిస్తున్నది.

అకాడమిలో తరగతి గదులన్నీ అధునాతనంగా మారాయి. ఎల్ సీడీ ప్రొజెక్టర్లు అమర్చి పవర్ పాయింట్ ప్రెజెంటేషన్లకు అనువుగా తీర్చిదిద్దారు.

మెస్ కు చేర్చి వెదురు పొదల మధ్య ఉన్న ఆహ్లాదకర ప్రదేశాన్ని "కిష్కింధ" గా పేరు పెట్టి మరింత అందంగా తీర్చిదిద్దడం జరిగింది.

తెలంగాణ రాష్ట్ర అటవీ అకాడమీ డైరెక్టర్ తో మరియు ఎపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ ఫ్యాకల్టీ సభ్యులతో సంప్రదించి రెండు కోర్సులకు (ఎఫ్ బి ఓ, ఎఫ్ ఎస్ ఓ) లెక్చర్ హవర్స్ ను, చక్కటి పాఠ్య ప్రణాళికను రూపొందించడం జరిగింది. క్వశ్చన్ బ్యాంక్స్, బిట్ బ్యాంక్స్ , పీపీటీ వంటి సమగ్ర బోధన సామగ్రి, పాఠ్య సామగ్రి ట్రెయినీలకు అందుబాటులోకి తేవడం జరిగింది.దథియరీ, ప్రాక్టికల్ రెండు విభాగాల్లోనూ ట్రెయినీలకు ప్రత్యేక క్లాసులు, కార్యక్రమాలు నిర్వహిస్తున్నా రు. బర్డ్ వాచింగ్ (పక్షి వీక్షణ) వంటి కార్యక్రమాలపై ఆ రంగంలో నిపుణులను ఆహ్వానించి ట్రెయినీ లకు అవగాహన కల్పించడం జరిగింది.

ట్రెయినీ లకు డ్రైవింగ్, వెపన్ హ్యాండ్లింగ్ లో కూడా శిక్షణ ప్రవేశ పెట్టడం ద్వారా ఈ శిక్షణను మరింత ప్రయోజనకరంగా తీర్చిదిద్దే కృషి జరిగింది.

నిరుపయోగంగా, మూసివేయబడి ఉన్న జి ఐ ఎస్ ల్యాబ్ ను అకాడమీకి తరలించి పునరుద్ధరించడం జరిగింది. ఒక జూనియర్ సైంటిస్టును ఈ విభాగంలో నియమించడమే కాకుండా అవసరమైన సాఫ్ట్ వేర్, హార్డ్ వేర్ పరికరాలను కూడా సమకూర్చడం జరిగింది.

ట్రెయినీల నైపుణ్యాలను మెరుగుపరచడం కోసం 20 కంప్యూటర్లతో ఒక ప్రత్యేక కంప్యూటర్ ల్యాబ్ ను ఏర్పాటు చేయడం జరిగింది.

ఏపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ కి ఒక విస్తృత శ్రేణి గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. అనేక రిఫరెన్స్ పుస్తకాలు, జర్నల్స్, వివిధ ప్రసిద్ధ ప్రచురణలు, ఉపయుక్త గ్రంథాలతో ఇది అలరారుతున్నది

ఏపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీకి ఒక eg.ap.gov.in/apfa వెబ్ సైట్ రూపొందించడం జరిగింది. ఈ వెబ్ సైట్ లో ఫ్యాకల్టీకి, ట్రెయినీలకు కూడా ఉపయుక్తమైన విలువైన సమాచారాన్ని, సిలబస్, టైమ్ టేబుల్ ఇంకా పాత ప్రశ్న పత్రాలు, బిట్ బ్యాంక్స్ వంటివి ఇందులో లభిస్తాయి.

ఏపి స్టేట్ ఫారెస్ట్ అకాడమీ కి ఒక అర్థవంతమైన లోగోను రూపొందించడం జరిగింది. దీని రూపకల్పనలో, ఖరారు చేయడంలో సర్వీసులో ఉన్న, రిటైర్ అయిన పలువురు అటవీ శాఖాధికారులు, ఉద్యోగుల సలహాలు, సహకారం తీసుకొని రూపొందించి, అంతిమంగా బోర్డు ఆఫ్ కంట్రోల్ అనుమతిని పొందడం జరిగింది.

నగర వనంలో ఒక ఓపెన్ ఎయిర్ థియేటర్ ను ట్రెయినీలకు అటవీ సంరక్షణ చిత్రాల ప్రదర్శన కోసం అందుబాటులోకి తేవడం జరిగింది. ఈ ఆడిటోరియాన్ని రాష్ట్ర డిజిపి (పోలీసు దళాధిపతి) శ్రీ ఎం మాలకొండయ్య 24-4-2018 న ప్రారంభించారు.

**BOOK POST** APTEL 15625

(Printed Matter)

To. ______________________

______________________

______________________

**P.S : If not delivered,**
Please return to..

The Director,
A.P. State Forest Academy
R.F.R.C. Complex
Lalacheruvu,
Rajamahendravaram- 533106

ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అటవీ అకాడమీ సంచాలకులు మరియు
ముఖ్య అటవీ సంరక్షణాధికారి, రాజమహేంద్రవరం సంయుక్త ఆధ్వర్యంలో...